# ఉపోద్ఘాతము



భారతవర్షము మహాపురుషులకు లీలా క్షేత్రము. ప్రతియుగమందును, భక్తులు, జ్ఞానులు, కవులు, రాజ్యతంత్రనిపుణులు, న్యాయసంస్థాపకులు, ధర్మోద్ధారకులు జనించి భారతవర్షమును బవిత్రవంతముగ నొనర్చియున్నారు. ఈమహాపురుషుల ముఖ వినిస్సృత వాక్యామృత ప్రవాహములు, కృష్ణ, గోదావరి, తుంగభద్ర, మొదలగు మహానదులవలె, భారతీయుల హృదయక్షేత్రముల యందుఁ బ్రవహించుచు, అమృతఫలంబులను ఫలింపఁజేయుచున్నవి. ఋగ్వేదకాలము.మొదలు, నేఁటివఱకును గల సంస్కృత వాఙ్మయమంతయు, ధర్మభావపూరితమై యుండుటయే గాక, ఆధునికసాహిత్యము లన్నియు, ధర్మభావప్రోద్దీపకములై, జాతీయ సాహిత్యమునకుఁ గల్పతరువులై, యలరారుచున్నవి. హిందీభాషయందు తులసీదాసుని

యొక్కయు, వంగభాషయందు రామప్రసాదసేనుని యొక్కయు, అరవభాషయందు తిరువళ్లువర్ యొక్కయు, ఆంధ్రభాషయందు వేమనయోగి, బమ్మెరపోతనామాత్యుఁడు, త్యాగరాజ స్వాములయొక్కయు, భక్తిరస పూరితమగు, కవితతోఁగూడిన పద్యములును, కీర్తనలును, ఆయా జాతీయులందఱ కానందమును గలిగింపుచు, ప్రేమారాజ్యమున కాకర్షింపుచున్నవి. ఆయా దేశముల యందును జనించి, జాతీయతయం దిమిడి మందీభూతమైయున్న, భక్తితత్త్వము నుద్దీపింపఁ జేసిన మహాభక్తులు, తమ తమ యిష్టదేవతల నుద్దేశించి చేసిన స్తుతి ప్రార్థనలతోఁ గూడిన కవిత్వమును, నేఁ లక్షలకొలఁది మానవులు పాఁడుచు హృదయతాపములఁ బాసి, శాంత, దాస్య, స్నేహ, వాత్సల్య, మధుర భావములం జొచ్చు చున్నారు.

పదునేడవశతాబ్దము, ప్రారంభమునందు తుకారాముఁడు జన్మించెను. ఈశతాబ్దమునందు, ఆర్యావర్తము మహావిప్లవమునకు లోనైయుండెను. తలిదండ్రులను చెఱసాలయందిడి, సోదరులలోఁ గొందఱినిఁ జంపించి, ఔరంగజేబు భారతవర్ష సామ్రాజ్య పీఠము నధిష్ఠించెను. ఈతఁడు ముప్పదికోట్ల హిందువులను,

శతాబ్దము మధ్యభాగమునందు మహాబలశౌర్యధుర్యుఁడగు శివాజియు, జ్ఞానసంపన్నుఁడగు రామదాసస్వామియు, భక్తాగ్రగణ్యుఁడగు తుకారాముఁడును, తమ తమ ధర్మములను నిర్వహింపుచుండిరి. సమగ్రభారతవర్షమునం దంతటను, నవశక్తిని వ్యాపింపఁజేయుటకు, భగవానుఁ డీముగ్గురను సృజియించెనని చెప్పినను జెప్పనొప్పు. వ్యక్తిగత జీవనమునకు వలెనే, జాతిగత జీవనమున కెపుడపుడు సుయోగము సంభవింపుచుండును. అప్పుడు జాతియొక్క ప్రతివిషయమందును కల్యాణోన్నతి లక్షితంబగును. మహాబలుఁడగు ఛత్రపతి శివాజీ మహారాజుయొక్క మహారాష్ట్ర సైనికగణము దిఙ్మండలములు ప్రతిధ్వనించు నట్లు రణవిజయనినాదములు చేయు నప్పుడు, తుకారాముని విరచితములగు, అభంగములు లక్షలకొలఁది మహారాష్ట్రులను, దేశభక్తి పూరితులుగ నొనర్చుచుండెను.

శివాజీ బాహుబలమునను, బుద్ధికౌశలమునను, మహారాష్ట్రసామ్రాజ్యమును స్థాపించెనని కొందఱు చరిత్రకారులు వ్రాసినవ్రాఁతలు, భ్రమ ప్రమాదములకు లోనై యున్నవి. ఒక్కబాహుబలము మీఁదనే నిర్భరపడి, జాతీయజీవనమును బ్రతిష్ఠాపించుట, యసం

# తుకారాము చరిత్రము



## మొదటి ప్రకరణము

---

మహారాష్ట్ర సామ్రాజ్యలక్ష్మికి మందిరంబు నాఁ బరఁగిన, పూనాపట్టణమునకు వాయవ్య మూలయందెనిమిది క్రోసుల దూరమందుండు, ఇంద్రాణీ నదీ తటమున "దేహూ" యను గ్రామము గలదు. ఆ గ్రామమునందు "మోరే" యను ఉపాధిగల ప్రాచీన మరాటీకుటుంబము నివసించుచుండెను. వీరు శూద్రులు. వాణిజ్యమే వృత్తిగాఁగల నీవంశీకులు, ఆదేశములోని యుచ్చపదస్థులగు మరాటీవారితోఁడి సంబంధ బాంధవ్యములు గలిగి గణనకెక్కి యుండిరి. ఈమోరే వంశమునందు క్రీ ౧౬౦౭ - ౧౬౦౮ వ వత్సరముల మధ్య సహిష్ణుతాధురంధరుఁడును, స్వార్థత్యాగియు నిష్ఠాగరిష్ఠుఁడును, భక్తశిఖామణియు నగు తుకారాముఁడు జనించెను.

పిమ్మట, నొకానొక దినమున, స్వప్నమునం దాయన ప్రత్యక్షమై చెప్పినవిధముగా, దేహూగ్రామ సమీప మందలి మామిడితోటలో, విఠోబా (విష్ణు) విగ్రహము దొరకెను. ఆ విగ్రహమునకు ఇంద్రాణీ నదీ తీరమున, దేవాలయమును గట్టించి అందు భక్తి పరవశుడై పూజార్చనలను జేయుచుండెను. విశ్వంభరుని భార్య యగు ఆమాబాయి భక్తిసేవా తత్పరయై యుండెను. ఆ దంపతుల జీవనమునందే భక్తిబీజము మొలకెత్తెను. వారికి తుకారాముడు సప్తమ పురుషుడు. ఈ భక్తా వతంసుని తండ్రిపేరు బోల్హోబా. చాల దినములనుండి యీవంశమునందు వచ్చుచున్న సద్గుణము లీయన యందు సంపూర్ణముగ వికసించెను. భక్తిపరాయ ణుడును, సేవానిరతుడునగు "బోల్హోబా" నిరతాన్న దాతయై, సమస్తప్రాణులయందును, దయయు, శాంత మును గలిగి ప్రవర్తింపుచు, కోపతాపము లెఱుగక, అనృతము వంకబోక, సన్మార్గపథమున నడచుచుం డెను. తుకారాముని తల్లి, కనకాబాయి. ఈమెపతి భక్తి పరాయణయు, సచ్చరిత్రయు, భక్తురాలునై యుండెను.

మునం దనుదినమును హరిభజనయు, భగవత్ప్రసంగ మును జరుగుచుండెను. ఇందువలన తుకారాముడును, భక్తులతోఁగూడి సంకీర్తన సల్పుచు, నృత్యముఁజేయు చుండుటవలన, బాల్యముననే యీయన హృదయ క్షేత్రమునందు భక్తిబీజములు మొలకలెత్త నారంభిం చెను. యుక్తవయస్సురాఁగానే బోల్హోబా యాడం బరముగ పుత్రికాపుత్రులకు వివాహములొనర్చెను.

పెద్దకుమారునకు సంసార మప్పగించి, మిగత జీవిత కాలమును, శాంతముగఁ గడప వలయునని బోల్హోబా తలంచెను. కాని బాల్యమునుండియు సంసారసుఖములయం దనురాగములేని "శాజీ" సంసార నిర్వహణభార గ్రహణమున కంగీకరింపకుండుట వలన, సంసార నిర్వహణభారము మన కథానాయకుని స్కంధముపైఁ బడెను. తుకారాముడు బాలుఁడైనను పిత్రాజ్ఞోల్లంఘనము చేయఁజాలక, సంసార నిర్వహణ కార్యమునకుఁ బూనుకొనెను. అప్పటికి తుకారాముని వయస్సు పదుమూఁడు వత్సరములు. ఐనను, బహు సమర్థతతోఁడ సంసార కార్యములను నిర్వహింపుచు, కుల పరంపరాగత వ్యాపారమునం దీతఁడు విశేష ప్రతిష్ఠ నార్జించి గొప్పగొప్ప ధనికుల విశ్వాసమునకుఁ బాత్రుఁడై, ధనమును గణింపుచుండెను.

నేకమై తుకారాముని యాధ్యాత్మికోన్నతి ప్రయత్నము
కుఁ గాలము దొరక నీయకుండెను. భావికాలోన్నతికి
విపత్తులు సోపాన ప్రాయములు గదా ? సాధారణముగ
దారిద్ర్యము, విపత్తులు, ఉన్నత భావముల నణఁచివే
యుచుండును. కాని కొంతమంది పక్షమున నవి
యమృతవృష్టియై సద్భావమను మొలకలను వృద్ధి చేయు
చుండును. బాల్యమునుండియు మహైశ్వర్యములలోఁ
దులఁదూగు సంసారమునందు పెరిగిన తుకారామునకు
కష్టములు దెలియునెట్లు? తలిదండ్రులు జీవించియున్నంత
కాలము తుకారామునకు సంసార మానందసాగరమై
యుండెను. కాని తలిదండ్రులు గతించఁగనే యాయన
జ్ఞాననేత్రము లున్మీలితము లయ్యెను. సుచరిత్రుఁడును
వినయశీలుఁడును, సంసార కార్యనిర్వహణ చతురుఁడు
నగు, తుకారాముఁ డందఱికంటెను, తలిదండ్రుల ప్రేమ
కెక్కుడు పాత్రుఁడై యుండుటవలన, తలిదండ్రుల
మృత్యువార్త నతిదుఃఖకరమై యుండుట సహజము
గదా? తుకారాముని జ్యేష్ఠసోదరుఁడగు "సావజీ"
సంసారమునం దుదాసీనుఁడగుట వలన సంసార భారము
తుకారాముని తలపైఁబడెను. ఇట్లు కొంతకాలము గడ
చియుఁ గడువకమునుపే జ్యేష్ఠసోదరుని భార్య మరణిం

మరంద పానమత్తులై, ప్రవర్తింతురనుటకు చరిత్రలు వేయినోళ్ళనుద్ఘోషింపుచున్నవి. ఈశ్వరప్రేమయందాత్మ విస్మృతి, యెల్లరకును లభ్యముగాదు. కాని రాజర్షియగు జనకుఁడు మొదలగు కొందఱు మాత్రమే, సంపదయందుండియు, భగవంతుని యందాసక్తిగలిగి యుండిరని వినుచున్నాము. దాదాపుగా భక్తులందఱు కష్టములవలన వైరాగ్యమును, వైరాగ్యమువలన భక్తిని పొందియుండిరని వివిధగ్రంథముల యందు వర్ణింపఁబడి యున్నది. మానవజీవితమునందు, విపత్తులపరిహార్యములు. కష్టములు గలుగుటవలన నెల్లరకుఁ బ్రేమలాభము చేకూరదనుట నిక్కువము. సముద్రము నందు దుముకు వారిలో ననేకులకు నత్తగుల్లలును, ఒకరిద్దఱకు రత్నములును లభించు విధముననే, సంసార సాగరమునందుఁ బడిపోవు కోట్లకొలఁది మానవులలో, స్వల్ప సంఖ్యాకులకు మాత్రమే భగవత్ప్రేమ లభ్యమగుచుండును. కాని సంపదలయందుఁ గాని, ఆపదలయందుఁ గాని, ఈశ్వరుని చూచుచుండుట కలవడిన వారెప్పుడును, ఈశ్వరుని ప్రేమనుండి వంచింపఁబడరనుటకు పురాతనవాఙ్మయమే సాక్ష్యము. తలిదండ్రులు గతించుటయు, సోదరుఁడు దేశాంతర గతుఁడగుటయు, ధన

కాని కృతకృత్యుఁడుకాఁ జాలఁడయ్యె. తదుపరి చిల్లర
వస్తువు లమ్ముదుకాణమును బెట్టెను. "కాని దానియందు
గూర్చుండి విశ్రామములేక హరిభజనచేయుచు బేర
గాండ్రు వచ్చినప్పుడు వారిచ్చిన ధనమున కేవిధమగు
లోపము లేక సరకు లీయవలయును. ఇందు పొర
బాటు జరిగినయెడల దోషము సంభవించును. కావున
బేరగాండ్రడిగినట్లు సరకులనిచ్చుట యుత్తమ మని
తలఁచి, వారడిగినట్లు సరకుల నిచ్చు చుండువాఁడు"
అని మహీపతి వ్రాయుచున్నాఁడు. ఇట్లు వ్యాపార
మొనర్చు చుండుట వలన దినమున కొక వ్యవహారము
నందుఁ బ్రవేశింప వలసి వచ్చెను. అందువలన తుకా
రాముని లోకులు చిత్తచాంచల్యునిగఁ దలంపుచు నిం
దించుటకు మొదలిడిరి.

"భగవానుని చరణకమలములయందుఁ దగు
ల్కొనియున్న మనస్సును ద్రిప్పుకొనుటకు నాకు వశము
గాదు. కావున నాశరీరమును వర్తకమునం దర్పించిన
యెడల కుటుంబ కష్టములు దూరమగును" అని తలఁచి
తుకారాముఁడు హరినామ స్మరణ చేయుచు, నెద్దుల
పైన ధాన్యపు గోతములనైచి, చుట్టుప్రక్కల గ్రామ
ములకేఁగి, ధాన్యమును విక్రయింపు చుండెను. కాని

కరమగు కార్యమింకొకటి లేదుగదా? తుకారాముం డీయవమానమును భరింపఁజాలక "ఈశ్వరా? నేనీ సంసారమెట్లు నడుపుదును? నన్నీ విధమగు విపత్తునందేల పడవైచితివి?" అని యెలుగెత్తి యేడ్వసాగె. ఈయన దురవస్థను జూచి కొందఱాత్మీయులు ధనసాహాయ్యమొసంగిరి. కొందఱు అప్పులవాండ్రకు పూచీపడిరి. ఇందువలన తుకారామునకుఁ జిక్కులు కొంతవఱకుఁ దీరెను. కాని హరినామ స్మరణవలన తుకారామునకీ దుర్గతి సంభవించినదని బంధుగులు, స్నేహితులు, నిశ్చయించుకొని, యీయన నీవిధముగఁ దూలనాడుటకుఁ బ్రారంభించిరి. "నీవు పరమార్థము నార్జింపనెంచి, దివారాత్రములు హరినామస్మరణఁ జేయుచుండుట వలన, నీకీ దురవస్థ సంభవించినది. కాఁబట్టి యిప్పుడైనను విఠోబా ధ్యానమును మానుము. విష్ణుభక్తుల సంసారము లున్నతికి రావని వినుచుందుము. దీనిని నీవు ప్రత్యక్షముగ ననుభవింపుచున్నావు. విషయాసక్తి లేనిచో సంసారోన్నతి యెట్లగును? ఈసంగతిని యోజింపక యెల్లపుడును, హరినామస్మరణను జేయుచుండిన యెడల నీకన్న మెక్కడ నుండి వచ్చును? నీకీమాటలసమ్మతములు గావచ్చును. కాని మామాటలు విననియెడల నీకు సర్వనాశనము గలుఁగుననుట నిక్కువము."

ఒకానొక దినమున నిర్జనమార్గము నందొంటరిగ హరి భజనఁ జేయుచుఁ బోవుచుండ, నొకవృషభము డస్సి పడిపోయెను. ఎద్దుమీఁది సరకుల గోతమును గూడ నొరుల సాహాయ్యము లేనిది దింపఁజాలక, హరి నామ స్మరణఁ జేయుచు, నలుదిక్కులు చూచుచుండు నంతలో, సూర్యాస్తమయ మయ్యెను. మేఘములు క్రమ క్రమముగ దట్టములగుచుండెను. తీవ్రశీతలవాయువు వర్షాగమనమును సూచించుచుండెను. ఇట్టి సమయము నం దాకస్మికముగ నొకఁడా* మార్గమునవచ్చి గోనెను దించి యెద్దును లేవఁదీసి, తిరిగి యెద్దుపైన గోతమును నైచుటవలన తుకారాముఁడు గమ్యస్థానమును జేరఁ గలిగెను. ఈవిధముగ వ్యాపారము చేయ మొదలిడిన కొన్ని దినములకే,మూఁడెద్దులు మరణించుటవలన, విషణ్ణ

*విఠోబా దేవుఁడు పథికుని వేషముస్టీ ధరించివచ్చి, భక్తునకు సాహాయ్యమును జేసి వెళ్ళెనని, మహారాష్ట్రమందు తుకారామ చరిత్రను వ్రాసిన మహీపతి వ్రాయుచున్నాఁడు. కాని మహాపురుషుల జీవనచరిత్రములయం దాశ్చర్య విషయములను జొప్పించుటయు సామాన్యవిషయముల నద్భుతముగ నిర్వచించుటయు, తెలుచుగఁ జూచుచున్నాము. అదేవిధముగ ఈయనచరిత్రయం దనేకాశ్చర్య విషయములుఁ గలవు.

# రెండవ ప్రకరణము



ఆత్మను భగవంతుని పాదారవిందములకును, శరీరమును సంసారమునకును సమర్పించి తుకారాముఁడు తిరిగి మిరపకాయలవ్యాపారమును జేయుటకు, కొంకణదేశమున కేఁగి సముద్రతీరమందలి యొకానొక గ్రామములోని దేవాలయసమీపమున, మిరపకాయల దుకాణమును బెట్టెను. తుకారాముఁడు, మామూలు ప్రకారమే మిరపకాయల విక్రయమునకుఁ బ్రారంభించెను. క్రయదారు లిష్టమువచ్చినంత ధనమిచ్చి, యిష్టమువచ్చినన్ని మిరపకాయలను దీసికొని వెళ్లుచుండిరి. తుకారాము మాఱుమాటాడక హరినామ స్మరణఁ జేయుచుఁ జూచుచుండెను. ఈవిధముగ నొకటి రెండు దినములలో దుకాణములోని మిరపకాయ లన్నియు దాదాపుగఁ బూర్తియయ్యెను. ఇట్టిసమయమునం దొకానొకఁడు వచ్చి "నేను కడు బీదవాఁడను. ఈదినము బంధుగులచే నాగృహము నిండియున్నది. మిగతవస్తువు లచ్చటచ్చట సమకూర్చుకొంటిని. కావున మీదగ్గఱ నిలువయున్న మిరప

మును మాత్ర మిచ్చి బాకీపడిన ధనమును వీలును బట్టి తీర్చుకొమ్ము" ఆమాటలను విని తుకారాముఁడు చేత నున్న ధనమంతయు నొసంగి గ్బ్రాసాలను పైకొనెను. ఈవ్యవహారములకు బంధుమిత్రులవలన తుకారా మెట్టి తిరస్కారములను బొందియుండునో వేఱుగ వ్రాయ ననవసరము. జిజీబాయి ధనికుని కొమార్తె. అందువలన నేమైనను వర్తకుల కొకింత విశ్వాసముం డెను. కావున నామె యొకానొక ధనికునియొద్దకేఁగి రెండువందల రూప్యములు ఋణముదీసికొనివచ్చి భర్త కిచ్చి వర్తకము చేయుఁ డని ప్రోత్సాహపఱచెను. వంశ గ్వాంశముగాను జన్మించుటవలన వర్తకముదప్ప వేఱు మార్గము లేదుగదా? ఆసమయమునం దాగ్రామము లోని వర్తకులు "వాలేఘాట్టు" అను స్థలమునకు వర్త కమున కేఁగుచుండిరి. తుకారాము వారితో నేఁగి క్రయ విక్రయముల కుపక్రమించిన కొలఁదిదినములలోనే తోడి వర్తకుల సాహాయ్యము వలన, వర్తకమునం దేఁబది రూప్యములు లాభమువచ్చెను. కాని వర్తకులతోడ తుకారాముఁడు గృహాభిముఖుఁడగు సమయము నందు, ఋణగ్రస్తుఁడైన యొక బ్రాహ్మణుని రాజభటులు వెంబ డించి వెళ్లుచుండిరి. చిక్కి జీర్ణవస్త్రమునుధరించి మెడకుఁ

బ్రాహ్మణునకు సమర్పించి, ధనబంధములనుండి విము
క్తుఁడాయెను.

తుకారాముఁడు స్వగృహమును ప్రవేశింపక
పూర్వమే, తోడివర్తకుల వలన జరిగిన వ్యవహారమం
తయు భార్యయు, మిత్రులును విని ఆయనకు పిచ్చియెత్తిన
దని సిద్ధాంతీకరించిరి. దరిద్రముచేఁ బీడింపఁబడుచున్న
జిజాబాయి కోపానలమునకు మేర లేదయ్యె. ఇందువలన
తుకారాము గృహమున నివసించుటకే దుస్తరము కాఁ
జొచ్చెను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి వర్షాభావ
మువలన మహారాష్ట్రదేశము క్షామదేవత పాలఁబడెను.
రూప్యమునకు రెండుసేర్ల బియ్యమైనను దొరక
కుండెను. తుకారాముని కుటుంబమువారు మలమల
మాడఁజొచ్చిరి. కుటుంబ దురవస్థను జూచి సహింపఁ
జాలక తుకారాముఁడిరుగు పొరుగు వారిని సాహా
య్యము చేయుఁడని కోరెను. కాని చేయువా
రెవ్వరు? మీఁదు మిక్కిలి కొందఱు "విఠోబా
నడుగుము. ధాన్య మిచ్చును" అని హేళనచేయ
సాగిరి. కాని భక్తులు దూషణ భూషణలకు లొంగరు
గదా? క్షామమింకను ఘోరమగు చుండెను. ప్రజలు
గృహములను వదలి, చెట్లుగుట్టలుపట్టి యాకలములను

చేయుచుండెడి వాఁడు. భక్తి రసామృత సింధుప్రవాహ
దోలలాంకు వారల జన్మమే గదా ధన్యము!

భార్య గతించిన కొన్ని దినములకే, ఈయన ప్రథమ పుత్రుఁడు పరలోక యాత్ర కేఁగెను. ఇందువలన తుకారాముఁడు దారుణవేదన ననుభవించెను. కాని యీశ్వర విధానమును గ్రహించుట దుస్తరముగదా? ఈశ్వరుఁడు భక్తుల ఘోర పరీక్షల యందేల పరీక్షింపుచుండునో నుడువఁజాలము. కాని మానవజీవితమునందు, కష్టము లపరిహార్యములు. పుటములు పెట్టిన కొలఁదిని బంగారు మేలిమి యగువిధముననే, కష్టములు సంభవించిన కొలఁదిని భక్తులు పవిత్రులగు చుందురు. బాల్యము నుండియు, భక్తిపరవశుఁడై యున్న తుకారాముని హృదయమింకను బశ్యముకాలేదు. సంసార సుఖములపై నాసను పూర్తిగ విడనాడఁ డయ్యె. కాని కష్టముల మీఁదఁ గష్టములు సంభవించు చుండుటవలన సంసార మనిత్యమనియు, సుఖదుఃఖములు క్షణభంగురములనియుఁ దలంచుచుండెను. ఇట్లు దలంచిన కొలఁదిని వైరాగ్యము వృద్ధి కాఁజొచ్చెను. వైరాగ్యాభివృద్ధితోఁడ అహేతుకీభక్తి యలవడుచుండెను. ఈయన హృదయాకాశమునం దవిద్యారూపకమగు రాత్రి గడు

దుస్సహ దుఃఖమేగదా? సంసారమున దుఃఖములు పర్వతప్రమాణములు. సుఖములు, స్వప్నజనితభ్రాంతి తుల్యములు. నా యాయుఃపరిమితి బహుస్వల్పము. ఇందుఁ జాలభాగము సంసార సేవయందే గడచెను. కాని యీశేషజీవితమును రుక్మిణీ మనోనాథుని సేవ యందు గడుపుదును."

తుకారాముఁ డీవిధముగఁ దలపోయుచు, జీవిత లక్ష్యమును స్థిరపఱచుకొని, హృదయశాంతి నొందెను. పుత్రికా పుత్రులను వీడి, ప్రాణనాథునితోఁడ ననంత ప్రేమ సాగరమునం దోలలాడుటకు మృతభర్తశరీరమును వడియం దిడికొని, ఘోరాగ్నిజ్వాలల మధ్య భస్మీపటలమగు సతి వలె, తుకారాముఁడు ప్రాణవల్లభుని చరణారవింద సేవా పరాయణచిత్తముతోఁడ, సంసారబంధనములం ద్రెంచుకొని, దేహూగ్రామమున కనతి దూరమందున్న, భాస్వానాథపర్వతారణ్యమునుఁ జొచ్చి, కఠోర తపస్సున కుపక్రమించెను.

శాస్వతానంద జనకము. ప్రేమాస్పదుని దర్శన మబ్బని యెడల ప్రేమించుదాని హృదయ మధీరమగును. ప్రేమాస్పదుని సాక్షాద్దర్శనము వలన ప్రేమించుదాని హృదయ మమృత సిక్తమగును. ప్రేమార్థుని శాశ్వత సౌఖ్య దాయకముగదా? నూతనాను రాగావస్థ యందుం ప్రేమించుదానియొక్క ఆతురతతోం గూడిన సుఖముతోం బోల్పందగిన సుఖ మితరసమయములయం దనుభవము నకు రాదనుట నిక్కువము. తుకారాముండు సమాను రాగజనితసుఖనిమగ్నుండై, సంపూర్ణముగ నాత్మవిస్మృతి నొంది, కాలభేదము లేక ప్రాణవల్లభుని సహవాస సుఖ మున కాలము గడుపుచుండెను. ఈతండెచ్చట కేంగిన దియుం దెలియక, ఆత్మీయులు వెదుక నారంభించిరి. తిరిగి తిరిగి కనిష్ఠసోదరుండంబానాథ పర్వతోపరిభాగ మున తుకారాముని గలిసికొనెను. సోదరుని యను రోధము వలన తుకారాముండు, పర్వతమును విడిచి, ఇం ద్రాణీ నదీతీరమునకు వచ్చెను. ఏడుపవాసములు గడ చిన పిమ్మట స్వగృహమునందీయన భుజించెను. సోద రుండు సంసారికావస్థను బోధింపందొడంగెను. ఈయన చేసిన వర్తకమువలన ధన కనక వస్తువాహనము లన్ని యుంబోయినను, తండ్రిగారిచ్చిన అప్పులపత్రములు

డెను. తుకారాముని జూచి, వర్తకమునందు నష్టము వచ్చుటవలన పిచ్చియెత్తినదనియు, మహాభక్తుఁడగుట వలననే ఇంద్రాణి జలములయందు మిగిలిన సర్వస్వము నర్పించెననియుఁ బాటకూటికి భక్తుని వేషముధరించి నాఁడనియుఁ బలువురు పలువిధములఁ బల్కుచుండిరి. గన్యస్తాశము దృష్టిపథమునుండి, దృఢ విశ్వాసమున నిర్గమించు వానికి, నిందాస్తుతులు బంధనములు కాఁ జాలవుగదా? ఇంద్రాణీనదీ తట తరుచ్ఛాయలలోను, భాండార పర్వతకందరముల యందును, ఏకాకిగ సంచ రింపుచుండు తుకారాముని యొక్క భక్తివిశ్వాసములు, ప్రకృతిసాహాయ్యము వలన, దిన దినాభివృద్ధి నొందు చుండెను. ఈతఁడింద్రాణీనదీ కలకల శబ్దముల యందును, విహంగ గణములమృదుమధుర రుతముల యందును, గిరిగహ్వార ప్రతిధ్వనుల యందును, ప్రియతముని కంఠ ధ్వనిని వినుచుండెను. బహుదూరమునఱకు వ్యాపిం చిన స్నిగ్ధ శ్యామ శోభల యందును, పుష్పగుచ్ఛముల సౌందర్యఘటనావిధానము నందును, శ్యామసుందర మూర్తి సౌందర్యమునే జూచు చుండెను. సుస్నిగ్ధశీతల సమీరతరంగముల స్పర్శవలన, నాచిరశీతలుని స్పర్శాను భవమును బొందుచు పులకాంకురితుఁడై, మధుపాన

గాక! కడుపు నిండ భుజించి పక్షులానందమున సంచరించుఁగాత" అని తలంచుచు పగలు రెండు జాములగు నంతటనే పక్షులవంకఁదిరిగి నది కేఁగి నీరు ద్రావిరండని కేకలు వైచుచు, లేవఁగొట్టి "సంధ్యా సమయమున చీకటి పడుచున్నది. మార్గము తప్పిపోవుదురు. కనుక మీమీ నిలయములకే కను వెలుతురున నేయఁగి సూర్యోదయమైనంతటనే తిరిగి రం"డని చెప్పుచు పక్షులఁ దరుము చుండెను. మఱియును, ఈ పక్షులు కావలసినంత వఱకు భుజించు చున్నవిగాని, మఱుదినమున కణుమాత్రమైనను దాచుకొనుట లేదుగదా యని తలంచి, నాయవస్థ యెప్పుడీవిధముగ నగునని, తుకారాముఁడు భగవానుని ప్రేమపై నిర్భరపడి, మఱుదినపు చింతనుండి విముక్తుఁడగుటకుఁ బ్రయత్నింపు చుండెను. రాత్రిపతిమవలె మంచెపైన నిశ్చేష్టిత భావమున నుండు తుకారాముని జూచి, పక్షులు లేశమైనను భయపడక, తండోపతండముగ వచ్చి, కంకులను భక్షించి యేఁగుచుండుటవలన స్వల్ప దినములలో నా క్షేత్రమునందలి పంటలోఁ జాలభాగము పూజ్యమాయెను. క్షుద్బాధా పీడితులగు వేలకొలఁది మానవుల కన్నమిడి సంతసించు మహాదాతవలె, పక్షులు భుజించుటను జూచి తుకారాముఁ డానందమును బొందు

ఈయన పూర్వపురుషుఁడగు విశ్వంభరుఁడు దేహూ గ్రామమునందుఁ గట్టించిన విఠోబాదేవుని మందిరము శిథిల మగుచుండుటవలన దానిని బాగు చేయుట కీయనపూనుకొనెను. కాని ధనమెచ్చటు? స్వహస్తముల తోడ మందిరమును బాగుచేయనెంచి మట్టి తోడ ప్రహరీ గోడను బెట్టుట కుపక్రమించెను. సదిచ్ఛతోఁ గూడిన కార్యమెప్పుడును భగవానుని కృప వలనఁ బూర్తియైతీరును. కాఁబట్టి యీయన ప్రయత్నమునకు సాహాయ్యము తనంతటఁదానుగ వచ్చుటవలన, స్వల్పదినములలోనే దేవాలయమును బాగుచేయించి అన్నదానమును జేయించెను.

ప్రతిదినమును భక్తులు నవ్యగీతములతోఁడ విఠోబాదేవుని స్తుతించుటనుజూచి, గీతగుచ్ఛముల రచియించి, విఠోబాదేవుని పాదయుగళమునం దర్పించుట కొఱకు, తుకారాముఁ డువ్విళ్లూరుచుండెను. ఇందువలన పూర్వకవి విరచితములగు భక్తిగ్రంథములను దదేకనిష్ఠతోఁ జదువుటకుఁ బ్రారంభించి * నామదేవుని యభంగ

---

* నామదేవుఁడు పదుమూఁడవ శతాబ్దశేష భాగమునం దుండెను. మహారాష్ట్రదేశమునందు ప్రప్రథమమున భక్తిబీజము నాటిన దీ మహాపురుషుఁడే. ఇందువలన మహీపతి మొదలగు భక్తచరితా

చుండెను. స్వాభావసిద్ధముగ జ్ఞాపకశక్తి యత్యద్భుతము గాఁగల తుకారాముఁడితరచింతలులేక సర్వదా భక్తి తత్త్వమును మననము చేయుచుండుటవలన, నచిరకాలము లోనే, భక్తిశాస్త్రము నందు పారదర్శికుఁడగుటయేఁ గాక, ఏయే మహాపురుషుల గ్రంథములీయన పఠించెనో, ఆయా మహానుభావుల చరిత్రములలోని సద్గుణములు, గంభీరభావములు, ఈయన హృదయమునందు ముద్రితములయ్యెను. పిమ్మట నీయన కవిత్వమును జెప్పుటకు మొదలిడెను. ఈకవిత్వవికాసమే తుకారాముని నవ జీవనమునకు మూలాధారము. ఇంతటినుండియు "శేట్" తుకారాముఁడు "భక్త" తుకారాముఁడయ్యెను.

---

భక్తులకు మార్గమును జూపుచుండెను. విఠోబా దేవుని సందర్శించుటకు వచ్చిన భక్తులు దేవళములోని కేఁగఁగనే, ద్వారముకడ నుండి వారి పాదరక్షలను గాపాడుచుండెను. రాజపక్షమున బరువు మోయుచు కష్టపడుచుండు వారలఁజూచినచో, వారికి కొంచెము శ్రమ తగ్గుటకు తానాబరువును కొంతదూరము మోయుచు, ముసురు పట్టిన దినములలో పథికులను సత్రమునకుఁ గాని, స్వగృహమునకుఁ గాని, దీసికొనివెళ్ళి, తగిన వసతుల నమర్చి సేవఁ జేయుచుండెను. తీర్థయాత్రాపరుల పథ శ్రమ నివారణార్థము, వేడినీళ్ళు కాచి వారి పాదములఁ గడగి, కాళ్లు పట్టుచుండెను. అన్నాతురు లయిన బీదల కిల్లిల్లు దిరిగి అన్నమును దెచ్చిపెట్టుటయు, నీరుదొరకని పశువులకు నీరుపోయుటయు, మేతదొరకని పశువులకు మేతవేయుటయు, నెయ్యి గోధుమపిండి మొదలగువానిని చీమల పుట్టలకడఁ జల్లుటయు, మొదలగు విశ్వ సేవా కార్యములను శక్తివంచన లేక చేయుచు, విశ్వేశ్వరునకుఁ బ్రత్యక్షముగ సేవఁజేయు భాగ్యమబ్బిన దని పరమానంద మగ్నుఁడగుచుండెను.

ఇట్లు తుకారాముఁడు విశ్వసేవావ్రత దీక్షయందుండ, ఒకానొక దినమునం దొక వృద్ధాంగన చేతికఱ్ఱపై

నిచ్చవచ్చిన పనులయం దుపయోగించుట కెవ్వరును వెనుకంజ వేయరైరి. తుకారాముఁడు చేతనైనంత వఱకు జీవకోటి సేవఁజేయుటచేత, అలసి రాత్రులు దేవళమున కేఁగి, శ్యామసుందర మూర్తిని సందర్శించి, పరమప్రీతితోఁడ నృత్యముఁ జేయుచు, కీర్తనలను బాడుచుండెను. మఱియు, తన విశ్వసేవావ్రతము సాగుచున్నందుల కెంతయు సంతసించుచు, విశ్వేశ్వరుని కొనియాడు చుండెను. కాని యీకార్యములకు జిజీబాయి సహింపఁ జాలదయ్యె. ఆరోగ్యవంతులును, దార్ఢ్యము గలవారుఁ గూడ, భర్తచేత బండ చాకిరిని జేయించుటను జూచి పతివ్రతయగు నే స్త్రీ సహించియుండఁ గలదు ?

నామదేవుఁడు రచించిన యభంగములు తుకారాముని భక్తివికాసమునకు మిక్కిలి సహకారము లయ్యెను. ఒకప్పుడు, తుకారాముఁడు పండరిపురమున కేఁగుచు, నామదేవవిరచితములగు ' అభంగములఁ బాడుచు, మైమఱచి, మార్గమధ్యమునం దొకచోట నిద్రింపుచుండెను. అప్పుడాయన స్వప్నమునందు, నామదేవుని వెంటనిడుకొని, విఠోబాదేవుఁడు ప్రత్యక్షమై " ఈతఁడు రచియింపఁ దలఁచిన అభంగములలోఁ గొన్నింటిని మాత్రమే రచియించియున్నాఁడు. కావున

రాముని ఈశ్వరాంశ సంభూతునిగ భావించుచుండిరి. దినములవరుసను జనులు గుంపులు గుంపులుగ వచ్చి తుకారాముని సంకీర్తనలయందుఁ జేరి నామరసమును గ్రోలుచుండిరి. పిచ్చివానిగఁదలంచుచుండిన వారిప్పు డీయనను మహాభక్తునిగఁ దలంపసాగిరి. తుకారాముని కీర్తనలు నలుదిక్కుల వ్యాపించిన కొలఁదిని, తీర్థయాత్రలకేఁగు ప్రజలవలె దూరదేశములనుండి గూడ జనులు గుంపులు గుంపులుగ వచ్చి యీయన సంకీర్తనయందుఁ జేరుచుండిరి.

ఇంతకుఁబూర్వము తుకారాముఁడు సంసారమును వీడి నిర్జనస్థలమున కేఁగి, తపస్సుచేసికొన వలయునని తలంచుచుండెను. కాని యిపుడు సంసారము నందుండి లోకహితమగు కార్యములను జేయవచ్చునను దలంపున, సంసారమును విడనాడవలయునను సంకల్పమును మానుకొనెను. గృహస్థాశ్రమ పక్షపాతిమైనంత మాత్రమున, తుకారాముఁడు సంసారమునందే మునిఁగి యుండెనని భావింపఁ జనదు. అర్థోపార్జనకనుగుణమగు శక్తిప్రవృత్తు లనేకదినములకుఁ బూర్వమే ఈయనను విడనాడియుండెను. ఇందువలన జిజీబాయియే సంసారభారమును భరింపవలసిన దాయెను. మహీపతి, ఈమెను

దరిద్రమునకుఁ దోడుగ, సంసారకార్యములయందు విముఖుఁడై, అహోరాత్రు లాధ్యాత్మిక తత్త్వమును బరిశీలింపుచుండు భర్తనుజూచి, ఎంతమంది స్త్రీలహృదయములు కోమలములుగ నుండునో విచారింపుడు! తుకారాముఁడు చేయుకార్యము లతి సాహసముతో గూడుకొనినవై యుండెను. దయార్ద్రచిత్తుఁడగు నీతఁ డొకానొకదినమున వస్త్రహీనుఁడగు కడుబీదవానిని జూచి, స్నానమున కేఁగిన భార్య కట్టుబట్టదెచ్చి, యాబీదవాని కిచ్చి విఠోబాకు వస్త్రమును సమర్పించితినని సంతసించెను. కట్టుకొనుటకు మిగిలియున్న యేకవస్త్రముగూడ బోయినప్పుడు, మునిజనోచిత సహిష్ణుత లేనియెడల, సంసారమునందు శాంతియుండుట దుర్లభముగదా? జిజీబాయి మధ్యాహ్నమువఱకుఁ గష్టించి, పరివారమునకుఁ బ్రాణములు నిలచుటకు సరిపోవు పదార్థములను దెచ్చి, వండి యుండు నప్పటికి, తుకారాముఁడు నలుగురయిదుగురిని వెంట నిడికొని వచ్చుటవలన పచనముచేసినపదార్థములను, అతిథులకును, భర్తకును బెట్టి, పరివారమంతయు, ఉపవసింపవలసి వచ్చుచుండెను. తనభర్తనులోకులు యుక్తాయుక్తజ్ఞానము లేని పిచ్చివాఁడని పరిహాసించునప్పుడీమె సహింపఁజాల

డెను. ఒకానొక దినమునందన్నము దీసికొని వెళ్లుచు నెండతాకుడు వలన నీమె మార్గమధ్యమునందుఁ బడి పోయెను. ఈ దురవస్థనుజూచి నప్పటినుండియు తుకారాముఁడు దేహూగ్రామమునందే నివసించు చుండెను. జిజీబాయి తిట్టుబోతనియు, మూర్ఖురాలనియు, మహాపతివ్రాసియున్నను సంసార కార్యములయందుఁ దప్పులను జూపించినవాఁడు గాఁడు. జిజీబాయి ప్రత్యక్షము మునగాకున్నను, నిజస్కంధమున సంసారభారమును వహించి, ఆర్థిక చింతనుండి భర్తను నివృత్తునిగ నొనర్చి సహధర్మినీ కర్తవ్యమును నిర్వహించెను. ఇందువలన నీమెయుత్తము రాలనియు, పతిభక్తిపరాయణ యని యుఁ జెప్పుటకు సందియము లేదు.

---

త్వమునకుఁ బూనుకొనిరి. అట్టివారిలోఁ బ్రథముఁడు "మాస్వాజిబాబా" అనుసాధువు. ఈయన దేహూ గ్రామము నందొక మఠమునుగట్టించి యందు నివసించు చుండెను. ఈయనను లోకులు మహాపురుషుఁడని తలంచు చుండిరి. క్రమక్రమముగ తుకారాముని సంకీర్తనల వలన నాకర్షింపఁబడి శిష్యులు తనచుట్టుఁ జేరకుండుటను వగచి, మాస్వాజీ క్రోధాన్వితుఁడై, తుకారాముని సాధించుటకు వేచియుండెను. ఇట్లుండ నొకానొక దినమున తుకారాముని గేదె, విఠోబాదేవళము నాను కొనియుండిన మాస్వాజితోటలోఁ జొరఁబడి పూల చెట్లను దినెను. ఇందువలన మాస్వాజి ఆగ్రహ గ్రస్తుఁడై తుకారాముని దిట్టసాగెను. కాని తుకారా ముఁడచ్చట లేఁడు. ఇదిజరిగిన కొన్నిదినములకు మాస్వాజి యాగ్రహమునకు తుకారాముఁడు లోఁబడ వలసినవాఁడాయెను. ఒకానొక "యేకాదశి సాయం సమయమున విఠోబాను దర్శించుటకును, సంకీర్తనవిను టకును, దూరప్రదేశములనుండి జనులు గుంపులు గుంపులుగ వచ్చుచుండిరి. మాస్వాజి తనతోఁటచుట్టు దట్టముగను విశాలముగను ముండ్లకంచెను వేయించెను. ఈకంచె విఠోబామందిరమునకు సమీపమందుండుట

రించుచున్నాను. "ఓభగవానుఁడా? దుర్జనుల సహవాసమువలన సాధుపురుషుల మానసిక శాంతిదూరమగునని తెలిసికొనుటకు నాకీశిక్షనువిధించి యున్నావు. ఇంతటినుండియు దుర్జనులకు దూరముండుండఁ బ్రయత్నింతును" కఠోర సంయమద్వారమున మనోశరీరములను వశపఱచుకొనిన, తుకారాముఁడు శత్రువు గొట్టు దెబ్బలను నీరవముగ సహించి యింద్రియనిగ్రహుఁడయ్యెను. గృహమునకేఁగఁగనే జిజీబాయి తుకారాముని శరీరమునుజూచి దుఃఖించి, గ్రుచ్చుకొనిన ముండ్లను బెఱికి శుశ్రూషఁజేయఁ గొంతవడి కాయన స్వస్థతఁజెందెను. సంకీర్తనకుఁ గావలసిన పదార్థములన్నియు సంసిద్ధమయ్యెను. ప్రతి సంకీర్తనకువచ్చు చుండు మాస్వాజిసిగ్గుపడి, ఆదినమున రాఁడయ్యె. అందువలన తుకారాముఁడాయనను బిలుచుకొనివచ్చుటకు తనశిష్యులనుబంప, సర్వాంగములు వేదనతోఁగూడుకొని యుండుటవలన రాఁజాలనని మాస్వాజిచెప్పెను. అనుడువులాలించి తుకారాముఁడాయన మఠమునకేఁగి సాష్టాంగనమస్కారమొనర్చి యిట్లనియె. "స్వహస్తముతోఁనన్ను గొట్టుటవలన మీసర్వాంగములు వేదనతోఁగూడుకొని యున్నవి. తోఁటచుట్టు వేయించిన

వలన మంత్రోపదేశమును బొందినటులు పురాణములు యందు వర్ణింపఁబడియున్నది. సహిష్ణుత, కఠోరసంయమము మొదలగు గుణముల నార్జించియున్న తుకారామునకు స్వప్నమునందు, విఠోబాదేవుఁడు స్వయముగ మంత్రోపదేశమును జేసెనని వ్రాసిన చరిత్రకారులలో మహీపతి యిట్లువ్రాయుచున్నాఁడు. "తుకారాముఁడు పండరిపుర నాథునిధ్యానించుచు నిద్దురఁబోయెను. స్వప్నమునం దింద్రాణీ నదీజలముల స్నానమాడి విఠోబా మందిరమునకువచ్చుచు, ఆమార్గముననే యేఁగుచుండిన యొకవృద్ధబ్రాహ్మణునిజూచి యభ్యాసాను సారముగ తుకారాముఁడాయనకు సాష్టాంగ దండప్రణామంబొనర్చెను. ఆయన తుకారాముని తల పైఁజేయిడి లేవదీసి కూర్చుండఁ బెట్టి "రామ, కృష్ణ, హరి" అనుమంత్రము నుపదేశించి, రాఘవచైతన్యుని శిష్యుఁడు కేశవచైతన్యుఁడనియు, కేశవచైతన్యుఁడు తనకు గురువనియు, తనపేరు బాబాజీచైతన్యుఁడనియుఁజెప్పి, పాండురంగనాథుని విడువకుండుమని నుడివెను. ఈ నుడువు లాలించి తుకారాముఁడు పరమ ప్రీతినొంది సాష్టాంగదండప్రమణామం బాచరించి, మీారీదినమున మాగృహమును బవిత్రముచేయవలయునని ప్రార్థింప

లభింపని దినములయం దుపవాసము చేయు చుండెను. దాదాపు రెండు నెల లీవిధముగ జరిగిన పిమ్మట యొకనాఁ డింద్రాణీ నదీజలముల స్నానమాడు సమయమున జిజీ బాయి వచ్చి తుకారాముని చేలాంచలముఁ బట్టుకొని యిట్లనియె. "మమ్ము విడనాడి రెండు మాసములుగ మీరరణ్యావాసము చేయుచున్నారు. మా సంగతియే మీ మనమునం దున్నటులు దోఁపదు. కనుక మేమెట్లు జీవింతుము ?" అను మాటలు విని "విఠోబాయు, రుక్మిణియు, సమస్తజగత్తునకుఁ దలిదండ్రులు. కావున నీవు వారి శరణుఁ జొరుము. నీయభావములన్నియుఁ బూర్తి యగును" అను పలుకులు విని జిజీబాయి దీనస్వరమున నిట్లు విన్నవించుకొనెను. "నేనెప్పుడును మీధర్మకార్యములకు వ్యాఘాతము గలిగింపను. కావున గృహమునకు వచ్చి మీచిత్తానుసారముగ హరిభజనను జేసికొను చుండుఁడు." అను ప్రార్థన కంగీకరించి, తుకారాముఁడు మరల స్వగృహమున కేఁగెను.

తుకారాముఁడు స్వగృహమున కేఁగి ప్రాంగణము నందలి తులసిమండపముమీఁదఁ గూర్చుండి హరిభజనఁ జేసికొనుచు, ధర్మోపదేశములను జేయుచు, హరికథలను జెప్పుచుండెను. సమయము దటస్థించినపుడెల్ల, అర్థాం

నిమగ్నురాలవై భావిచింతనుండి విముక్తినొందుము. క్షణభంగురమగు ఇహసౌఖ్యములఁబరిత్యజించి విఠోబానామామృతమును గ్రోలుము. అప్పుడు నీవు పరమానందమును బొందుదువు." ఈయుపదేశమును జిజీబాయివిని మఱుదిన ముదయమున సర్వస్వమును బ్రాహ్మణులకర్పించుట కంగీకరించెను. మఱునాఁడు గృహమునందలి సమస్త వస్తువులను దానముచేయుటకు మొదలిడి చివఱకు భోజనపాత్రలనుగూడ నీతఁడు పంచిపెట్టెను. అన్నియు దానముచేసిన పిదప నొకబీదస్త్రీ, వస్త్రమిమ్మని తుకారాముని బ్రార్థించెను. అప్పుడీయన జిజీబాయి కట్టుకొనుటకు మిగిలియున్న చిరుగులచేల నొక్కదానిని యాస్త్రీకి దానము జేసెను. జిజీబాయి యంతవఱకును గంభీరముగఁ జూచుచుండెను. కాని లజ్జానివారణార్థము మిగిలియున్న చిరుగులచీర యొక్కటియుఁ బోవుటవలన ధైర్యచ్యుత యై తుకారామునిఁదూలనాడెను. జిజీబాయిని తిట్టుఁబోతనియు, మూర్ఖురాలనియు, నిర్ధారణఁ జేయునప్పుడు, ఆమెయెటువంటి కఠినపరీక్షలయందుఁ బరీక్షింపఁబడు చుండెనో, గమనించుట యత్యావశ్యకము.

తుకారామునకు కాశీ, భాగీరథీ, గంగయను ముగ్గురు కొమార్తెలును, మహాదేవుఁడు, విఠోబాయును,

యించెను. అప్పుడు తుకారాముఁడు "ఉత్తమజ్ఞాన"మను పదునొంకండభంగములను, భగవత్ప్రసాదమగు నొక నారికేళఫలమును, బ్రాహ్మణునకొసంగెను. దేవభాష యగు సంస్కృతమందుఁ గాక, దేశభాషయగు మహా రాష్ట్రమునం దభంగములుండుటచేతజ్ఞానాభిమానియగు బ్రాహ్మణునకాయభంగములు రుచింపకుండెను. అందు వలన నాయభంగములను, నారికేళఫలమును, అచ్చటనే దిగవిడిచి యాయనతిరిగి జ్ఞానేశ్వరునియొద్ద కేఁగెను. ఆ బ్రాహ్మణుఁడేఁగిన కొండొకవడికి "ఖండోబా" యను బ్రాహ్మణుఁడు వచ్చి బ్రాహ్మణునిచే విడువఁబడిన యభంగములను, నారికేళఫలమును గైకొనెను. అప్పటినుండియు నాయన భక్తిభావము వికసింప నారంభించెనని చెప్పుదురు.

ఈనారికేళఫలమునుగూర్చి యింకొక వాడుక గలదు. "ఒకానొకధనికుఁడు తన కార్యసిద్ధియైనచో జ్ఞానేశ్వరునకు విస్తారధనమును జెల్లింతునని మ్రొక్కు కొనెను. కార్యసిద్ధియైనపిమ్మట జ్ఞానేశ్వరుని యాదేశాను సార మాధనము తుకారామునకు సమర్పింపవలసి యుండెను. కాని తుకారాముఁడు ధనమును స్వీకరింపఁ డను తలంపున, ఆ ధనికుఁడు నారికేళఫలమునందు

# ఆఱవ ప్రకరణము



తుకారాముఁడు చుట్టుపట్లగ్రామముల కేఁగి హరి కథలను జెప్పుచుండెను. క్రమక్రమముగ ననేకు లీయన మార్గానువర్తులగుచుండిరి. జనులీయన ననుసరించిన కొలఁదిని యీర్ష్యాప్రధానులలోఁ గొందఱు, తుకారాముని కష్ట పెట్టుటకారంభించిరి. శూద్రకుల సంజాతుఁడైన తుకారాముఁడు బ్రాహ్మణులకుఁగూడ ధర్మోపదేశములను జేయుచున్నాఁడని కొందఱును, శాస్త్రమర్మము లంత్యజాతులవారికిఁ బోధించుచున్నాఁడని మఱికొందఱును, ఆగ్రహ గ్రస్తులగుచుండిరి. రామేశ్వరభట్టను పండితుఁడా కాలమునందు, సనాతనధర్మ రక్షకుఁడను ఖ్యాతిని గాంచియుండెను. ఆయన తుకారాముఁడుపదేశించు భక్తిమార్గం బంగీకరింప కుండుటయేగాక సాధారణశాస్త్రాభిమానులగు పండితులవలెనే, మూఢుఁడనియు, ధర్మోపదేశమును జేయుట కనర్హుఁడనియుఁ దలంచి క్రోధావేశపరవశుఁడై యాతని నణఁగఁద్రొక్కుటకు సమకట్టెను. ఒకానొకదినమున రామేశ్వర

భట్టు, ఈయనను జూచినంతటనే, తోఁకద్రొక్కిన త్రాచువలెలేచి మండిపడుచు "తుకారాముఁడా ? నీవు శూద్రుఁడవు. సంకీర్తనలయందు శ్రుతులలోని మర్మములను వెల్లడించు కవిత్వమును జెప్పుచున్నావు. ఇందువలన నీవును, వినువారలును, మహాపాతకమును బొందుదు"రని చెప్పఁ నుడువులాలించి తుకారాముఁడు విఠోబా దేవుని యాదేశానుసారమునఁ గవిత్వమును జెప్పుచున్నానని విన్నవింప, రామేశ్వరభట్టుయిట్లనియె. "వేద శాస్త్ర పురాణములయందుఁ గొఱవడిన ధర్మము లుపదేశింపుమని విఠోబా నీకాజ్ఞయొసంగినాఁడు కాబోలును! నీకవిత్వమువలన మహాపురుషుల యుపదేశములు నశించుకాల మాసన్నమైనది. లోకులు నీయభంగములలోని మృదుమధురరసము నాస్వాదించి పూర్వపురుషుల యుపదేశములు వినుటకుఁగూడఁ బ్రయత్నింపకున్నారు. ఇందువలన నుత్తమధర్మము లోపించుననుసందియము కలుగుచున్నది. కావున నీవింతటినుండియు అభంగములఁ జెప్పఁజనదు" అను వాక్యములను తుకారాముఁడు శిరస్సునధరించి యిట్లనియె. "ఇంతవఱకు నేనురచియించిన అభంగముల విషయమున తమయాజ్ఞను వినఁ గోరుచున్నాను. అన రామేశ్వరునిభట్టు అణు

మున కెళ్లఁగఁగలనని తలఁచి, విఠోబా మందిరమును ప్రవేశించెను. నూతనాభంగముల రచననుగూడ నిషేధించుటవలన, నాయన దుఃఖ మసహనీయ మయ్యెను. తల్లినిగాఁగలించుకొని యేడ్చుశిశువువలె, తుకారాముఁడు విఠోబాను కౌఁగిలించుకొని యిట్లనియె. "ప్రభో! నీవీ జగత్తునకు కర్తవు. నీకరుణాప్రసాదమువలన నేనీయభంగములను రచియింపఁ గలిగితిని. తిరుగ నీవే యాబ్రాహ్మణుని జిహ్వాయందుండి వానిని యింద్రాణీయందుఁ బడవేయ నాజ్ఞయొసంగి యున్నావు. కావున నీయాజ్ఞ నెఱవేరునుగాక" అనుచు దేవళమునువిడిచి, నదీతటమును జేరి జొటజొటరాలు కన్నీరు కాల్వలై పాఱ, హరినామస్మరణఁజేయుచు, అభంగముల గ్రంథము నొకరాతికి గట్టి వస్త్రమునుజుట్టి దానిని విడువఁజాలక విడువఁజాలక, నదీజలమునవిడిచి, రోదనముచేయసాగెను. ఈయన యైహికసంపదను విసర్జించునప్పు డణుమాత్రమైనను, విచారమును బొందియుండలేదు. కాని యభంగముల నింద్రాణీనదీజలములకర్పించి, మేరలేని హృదయవేదనఁ బొందుచు, ఆహారపానీయముల వర్జించి విఠోబామందిరమున కెదుటనుండు తులసికోటపైఁ బరుండి, విఠోబాధ్యానమున నిమగ్నుఁడై యుండెను. ఈ

నందువలన, ఫకీరు క్రోధాన్వితుండై యాతని దిట్టెను. అందువలన స్నానానంతరము రామేశ్వరభట్టుని శరీరము మంటలెత్తసాగెనట! శరీరవేదన సహింపంజాలని రామేశ్వరభట్టును ఫకీరు శరణుం జొరుమని శిష్యులనిరి. కాని, యాతండు, ముసలమాను ఫకీరునకు శరణార్థి యగుట కంగీకరింపక, జ్ఞానేశ్వరుని సమాధియొద్ద కేంగి రక్షింప వేడుకొనుచుండెను. ఇట్లుండ రామేశ్వర భట్టున కొకనాండుజ్ఞానేశ్వరుండు స్వప్నమునందుం బ్రత్యక్షమై యిట్లనియె. "భగవద్భక్తుండగు తుకారాముని కష్ట పెట్టుటవలన నీకీగతి పట్టినది. కావున నీవాయనశరణుం జొరుము" అనునుడువులాలించి మేల్కాని తుకారాముని, అభంగములు తిరుగ లభించిన వృత్తాంతమును శిష్యులవలన విని, స్వయంకృతాపరాధమునకు లజ్జితుండై, తన శరీరాస్వస్థతను దెలుపుచొక లేఖను వ్రాసి, తుకారామునికడకంపెను. తుకారామా లేఖను జదువుకొని యాయన దుర్దశకు వగచి, ఈక్రింది యభిప్రాయముగల యభంగమును బ్రత్యుత్తరము క్రిందం బంపించెను. "హృదయము నిర్మలమైన యెడల శత్రువులు హృదయ సమానులగుదురు. కావున సర్వభూతసమత్వముగలిగి విఠోబాదేవుని శరణుంజొచ్చి మనుము."

మమున తుకారామునిపై ద్వేషము కలిగియుండి తుదకు తుకారాముని ధర్మోపదేశశ్రవణమువలన మనోపరివర్తనుఁడయ్యెను. ఇందువలన శివాజి సంసార ధర్మములను విడనాడి, రేయింబవళులు తుకారాముని వెన్నంటి దిరుగుచు, సాధుసజ్జన సేవకు తన సర్వస్వము నర్పించుచుండెను. దీనిని జూచి యాయనభార్య సహింపఁజాలక తనభర్త చెడి తిరుగుటకుఁ గారకుఁడగు తుకారామునిఁ గడ తేర్పవలయునని తలఁచి, తనయింటికాయనను భోజనమునకుఁ బిలచెను. స్నానమునకు శరీరము బొబ్బలెక్కునంతటి వేడినీళ్ళిచ్చి, విషమిశ్రిత పదార్థములఁ గుడువఁబెట్టెను. భగవానుని యనుగ్రహమువలన, విషమిశ్రితపదార్థము లీయనకుఁ బ్రమాదముఁ గలింగింపఁజాలకున్నను, వేడినీళ్ళస్నానమువలన శరీరము బొబ్బలెక్కెను. తుకారాముఁడీ దురవస్థను విఠోబాపాదములకైఁబడి విన్నవించుకొనెనేగాని, శివాజి భార్యపైని యణుమాత్రమైనను గోపమును జెందఁడయ్యె. ఒకటి రెండు దినములలో తుకారాముఁడు స్వస్థతను జెందెను. కాని ఇందువలన ధూర్తురాలగు శివాజిభార్య కుష్ఠురోగగ్రస్తురాలయ్యెననియు, తుకారాముని కరుణవలన కుష్ఠురోగమునుండి యామె ముక్తినొందెననియు, మహీపతి వ్రాయుచున్నాఁడు.

# ఏడవ ప్రకరణము



భక్తులభావములయం దీశ్వరప్రకాశమును జూడఁ గలము. శిశువుచేయుప్రతికార్యమందును, తల్లిప్రకాశిం చుచుండువిధముననే, భక్తునియొక్క సమస్తకార్యముల యందును, పరమేశ్వరుఁడు ప్రకాశింపుచుండును. భక్తు నిప్రయత్నము లెప్పుడును వ్యర్థములు గావు. భక్తుల పిలుపునకు భగవానుఁడు పలుకుచుండును. భక్తుల యాశ యములను బూర్ణ మొనర్చును. వారిహృదయములయం దధిష్ఠించియుండును. ఇందువలన, భక్తునిముఖద్వార మున, భగవానుని సౌందర్యమును జూడఁగలము. భక్తుని వాణిగుండ, ఈశ్వరవాణిని వినఁగలము. భక్తుని యం గమునుండి యాయన ప్రేమాసౌరభమ నాఘ్రాణింపఁ గలుగుదుము. స్పర్శమణియగు భగవానుని స్పర్శనము వలన, భక్తునికబ్బు శక్తికి మేర లేదుకదా ! భక్తుఁడను క్షణమును, భగవంతునితోఁ జేళి సల్పుచుండుటవలన, ననాయాసముగ, కష్టములను, మరణమును, తుచ్ఛ ముగ చూడఁగలుగుచున్నాఁడు. మహారాజాధిరాజుల

శివాజీ హృదయమునందు, స్వదేశాభిమానమును, స్వధర్మనిరతియు, దట్టముగ నాటుకొని యుండెను. ఇందువలన స్వధర్మరక్షణార్థము స్వరాజ్యస్థాపనమే మార్గమనియెంచి తుకారాముని భక్తివలనను, రామదాసస్వామి జ్ఞానము వలనను ప్రబోధింపఁ బడుచున్న మహారాష్ట్రులకు, కార్యనిర్వహణదీక్ష నొసంగి, అఖండ మహారాష్ట్ర సామ్రాజ్యమును స్థాపించెను. శివాజీకి సంరక్షకుఁడుగ నుండి, ఆయన భావికాలోన్నతి కనుగుణమగు శిక్ష నొసంగుచుండిన వారిలో ముఖ్యుఁడగు *దాదాజీ కొండదేవుఁడు 'స్వరాజ్యస్థాపనా వ్రతము సంపన్నము గావలయుననిన సాధు పురుషుల దీవనలొందుటయు, వారియుపదేశముల వినుచుండుటయు, అత్యావశ్యకము'

---

* ఒకప్పుడు తుకారాముని మతమునకు వ్యతిరేకముగ ఇద్దఱు బ్రాహ్మణ బ్రహ్మచారులీయనయొద్ద అభియోగమును దెచ్చిరి. ఈ విచారణయందు దాదాజీకొండదేవుఁడు తుకారామును స్వపక్షమును సమర్థింపుకొనుమని నుడివెను. తుకారాముఁడు భక్తిరసామృతమును గురియు అభంగముల ద్వారమునఁ దనపక్షమును సమర్థించుకొనుటం జూచి బ్రహ్మచారుల హృదయము మారిపోయెను. అప్పుడు దాదాజీ కొండదేవుఁడు తుకారాముని సన్మానించి నింద్యులగు బ్రహ్మచారులకు శిక్ష విధించెను. కాని తుకారాముని యనురోధమువలన దాదాజీ కొండదేవుఁడు బ్రహ్మచారులను వదలివేసెను.

సభ కేఁగవలయునని హృదయము నాకర్షించుచుండెను. రెండవదైపున రాజసభ కేఁగినచో ఉపాయనములను స్వీకరింపవలసి వచ్చునేమోయను భీతి నిరుత్సాహ పఱచుచుండెను.

అందువలన నీసందర్భమునం దీయభిప్రాయము గల అభంగములను మూలమునఁ దనమానసికావస్థను విఠోబాదేవునకు నివేదించుకొనియెను. "ప్రభో! ఇటువంటి వానినెప్పుడు నినుఁగోరనుగదా! నాథా! నన్నేల కష్టములయందుఁ బడవైచెదవు? ఎల్లప్పుడు సంసారమునకు దూరముందుండుటకే గోరుచుందును. మానవుల సాంగత్యము చేయవలయునను, ఆసయే దూరమగుచున్నది. విజనవిపినమధ్యమునం దానందముతో సంచరించుచుండుటయే నాకుసంతోషదాయకము. ఓనాథా! ఛత్రచామరములును, గజాశ్వములును, దివిటీలును, పుణ్యపథగమనమునకు సహకారులు కావు. ఓపండరిపురినాథా! నాకిటువంటి బంధనము లేల తగిలించుచున్నావు? ఐశ్వర్యమును, సన్మానమును, దంభమును, సూకరపురీష సమముగ జూచుచుందును. కావున నన్నీ విపత్తునుండి యుద్ధరింపుము." ఇట్లు తనమానసికావస్థను విఠోబాదేవునకు నివేదించుకొని స్థిరచిత్తుఁడై

వారలు త్రిభువనైశ్వర్యముల కధికారులై యున్నారు. ఆయన భక్తులకు తల్లియుఁ దండ్రియునై బలమొసంగుచుండును. అందువలన వార లసమాన బలవంతులనుట నిక్కువము. సమగ్రవైకుంఠము భక్తులగృహమై యున్నది. విఠోబా యనుగ్రహమువలన భక్తులప్రభుత్వము సర్వత్ర స్థాపింపఁబడియున్నది. ధనము, ప్రతాపము, వీర్యముకలవానికి రాజపదముప్రాప్తించును. విఠోబా దేవుని యనుగ్రహమువలన భక్తులిమ్మోఁడు లక్షణములు కలిగి రాజాధిరాజులకంటె శ్రేష్ఠులైయున్నారు. కావున భక్తులను బరితృప్తిపఱుప వలయు నను ఇచ్ఛ నీకున్న యెడల, హరినామస్మరణఁజేయుచు, తులసిమాలల ధరించి, ఏకాదసీవ్రతము నాచరింపుచు, హరిదాసుఁడవు గమ్ము. అప్పుడు భక్తులు తృప్తినొందుదురు."

మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపకుఁడగు శివాజీ మహారాజు వంగి చేతులుజోడించుకొని స్వర్ణముద్రల కలశమును గైకొనుఁడని తుకారామును బ్రార్థించు నప్పుడు తుకారాముఁ డాకలశమును క్రీగంటనైనఁ జూడక, మహాభక్తులకుఁగల సర్వభూత సమదర్శిత్వమును బోధించి, హరిపదము లాశ్రయించి మను మను దృశ్యము, కవిపరేణ్యుని లేఖినివలనను, చిత్రకారుని కుంచెచేతను, అమరత్వమునొందుట కర్హముగదా !

దని నిశ్చయించుకొని, నిర్జన స్థానమున కేఁగి భక్తిసాధనయందు శేషజీవితమును గడుపవలయునని సంకల్పించుకొనెను. సంకీర్తన ముగియఁగనే శివాజీ మంగళహారతిని దర్శించి, తుకారామునకు నమస్కరించి, ఛత్రచామరములు మొదలగు రాజోచిత చిహ్నములను పరిత్యజించి, ఏనెపమున నెవ్వరును దన్ను సమీపింపఁ గూడదని యుద్యోగస్థుల కాజ్ఞనొసంగి, లోహగ్రామ సమీపమందున్న నిర్జనారణ్యమున కేఁగెను. ఇట్లు పవలెల్లను నిర్జనప్రకృతి సహవాసమునఁ గాలము గడుపుచు, రాత్రులు సంకీర్తనా సమయమునకు లోహగ్రామమునకు వచ్చి సంకీర్తనను వినుచుండెను ఈవిధముగ కొన్ని దినములు గడచునప్పటికి, శివాజీ యుద్యోగస్థులు భయఁపడి యీయన ప్రవర్తనను రాజమాతకుఁ దెలియఁబఱచిరి.

పిడుగువంటి యీవార్తను విని నంతటనే జిజీబాయి శోకాకులచిత్తయై లోహగ్రామమునకు వచ్చి శివాజీ విరాగమునకు, తుకారాముని యుపదేశములే కారణమని గ్రహించి, ఆయనను శరణుఁ జొచ్చి, "ఓ భక్తవరా! నాపుత్రుఁడొక్కఁడు. సన్న్యాస మవలంబించిన నేనెటులు సహించి మనఁగలను? మావంశము

జయించుటయు, ప్రజాపాలనమును, క్షత్రియుల ధర్మ ములు. సుఖాభిలాషియగు వ్యక్తి నిజావయవపుష్టిని జూచికొని తృప్తి నొందు విధముననే, రాజులు సము దాయ ప్రజాసౌఖ్యమునుజూచి యానందము నొందు చుండవలయును. సదసద్వివేకములతోఁ గూడుకొని, ప్రజాపాలన మొనర్చుటకంటె క్షత్రియులకు మహత్తర ధర్మ మింకొకటి లేదు. క్షత్రియులు సత్యనిష్ఠ గలిగి, ప్రజాసుఖమే తమ సుఖముగ భావించి, సర్వభూత దయఁ గలిగి, సర్వకాల సర్వావస్థలయందు హరినామ స్మరణఁ జేయుచు, భగవత్కరుణకుఁ బాత్రులై మన వలయును. కావున నిట్టివారి విషయమునం దరణ్యా వాసము ప్రయోజనకారి కాదు. కనుక వీరికి భగవా నుఁడు స్వయముగ వచ్చి దర్శన మిచ్చును". ఈవిధమగు బుద్ధిప్రాభవమున శివాజీ పట్టుబడక తప్పించుకొనెను. ఇందువలన శివాజీ మహారాజుయొక్క ధర్మాసక్తియు, భగవద్భక్తియు, తుకారాముని సంకీర్తనాశక్తియు వెల్లడి కాఁగలవు.

---

భింపఁ జేయుచుండిరి. ఇట్టిపుణ్యక్షేత్రములలో నేటి కిని పవిత్రతమముగ పరిగణింపఁబడుచు, హిందువుల యొక్క క్రమోన్నతిని దెలుపుచు భారతజాతీయధర్మ భావమునకు కేంద్రస్థానమనఁ జెల్లునది వారాణసిపురము. వైష్ణవులు శైవులు మొదలగువారలకు వేఱ్వేఱు పుణ్య క్షేత్రములుకూడఁ గలవు. అట్టివానిలో పండరిపురము మహారాష్ట్ర దేశీయ వైష్ణవులకు పరమపవిత్రస్థలము.

పండరిపురనాథుని యుత్సవమునకు వేలకొలఁది భక్తులు సమావేశమగుచుండిరి. ఒకానొక సమావేశ మునందు ప్రఖ్యాతికెక్కిన జ్ఞానియు, భక్తుఁడును, శివా జీమహారాజునకు దీక్షాగురువును అగు రామదాసస్వా మియు, తుకారామును బరస్పర దర్శనమువలన ధన్యు లైరి. ఈయుత్సవమునందు సమావేశమైన భక్తులెవరి పంథానుసారముగ వారు సంకీర్తనను జేయుట కుపక్ర మించిరి. తుకారాముఁడు తనయభ్యాసాను సారముగ భక్తులతోఁగలసి సంకీర్తనఁజేయుచు హరికథలు చెప్పు చుండెను. ఒకదినమున భక్తులందఱు తుకారాముని సంకీర్తనమునందు జేరి పరమప్రీతినొంది మఱునటిదిన సంకీర్తనాభారమును రామదాసస్వామిపై నిడిరి. ఆది నమున భక్తులయాజ్ఞ ప్రకారము రామదాసస్వామి

హింపుచుండెను. గోపికల వేషములను ధరించి విరహా
గీతములఁబాడుచు, కోలాటము వేయుచుండు భక్తవరుల
గాంచిన కొలఁదిని, చూపరులానంద పరవశులై ప్రేమ
గీతములఁబాడుచు, చేతులఁదట్టుచు నాడుచుండిరి.
కొందఱు బాడుచు "శ్రీకృష్ణుఁడవతరించెను" అని కేకలి
డుచు, అఱచుచు, పరుగిడుచు, త్రోవకడ్డమైన వారిని
కౌఁగిలించుకొని "శ్రీకృష్ణుఁడుదయించెను. కుశలముగ
బృందావనముఁజేరెను" అని నుడువుచు చెట్టుపుట్టలఁ
గూడ నీసువార్తను జెప్పుచుండిరి. ఒకభక్తుఁడు భీకరా
కారమునుదాల్చి మనచిన్నికృష్ణుఁడు శకటాసురుని సంహా
రించెననియు, ఇంకొకఁడు మనగోపాలకృష్ణుఁడు పూత
ననుఁ బరిమార్చెననియు, వేఱొకఁడు మన బాలగోపా
లుఁడు ధేనుకాసురుని వధించెననియు, శ్రీకృష్ణుని విజయ
వార్తలను జాటునప్పు డందఱేకగ్రీవముగ 'మనగోపాల
కృష్ణుఁడు బలరామునిఁగూడి మధురాపురమున కేఁగి
రజకుని హతమొనర్చి కంసునివధించెను' అనియఱచుచు
"కృష్ణా, కృష్ణా" యని భూమికంపింప నృత్యముఁజేయు
చుండిరి. తుకారాముఁడు భక్తులవంకఁ దిరిగి భీష్మద్రో
ణాశ్వత్థామకర్ణ శల్య దుర్యోధన భీమసేనులతోఁ
బ్రకాశింపుచున్న; కురుపాండవ వాహినీమధ్యమునందు

యు నాకర్షించి ఆడించుచున్న జగన్మోహనమూర్తి యగు శ్రీకృష్ణుని చిఱునవ్వును నిబిడాంధకార బంధురం బగు నిశీథివేళ మెఱయు మెఱపువలె సందర్శించిరి. కాని వారికన్నులకరువుతీరుటెట్లు? చేఁజిక్కినమణి జారిపోయినటులు పరితపించుచుండ, ఆలమందలలోని యంభారవములను విని యులికిపడి పకపక నవ్వుచు దాదవ్వుల బృందావనమును సందర్శించి 'శ్రీకృష్ణా! శ్రీకృష్ణా' యని పిలుచుచు, ఆలమందలమధ్య నృత్యముఁజేయుచు మురళీనాదముచే నైంద్రజాలకునివలె భక్తులెల్లరిచే నృత్యముఁజేయించుచున్న వేణుగానలోలుని, మృదుమధుర వేణుగానస్వనము చెవులసోకినంతనే వెఱ్ఱులై పనిపాటలు మాని పసిపాపలవీడి తండోపతండములుగ పారివచ్చు గోపికాబృందమునంగలసి, బాలగోపాలుని దరిఁజేరి వేణూస్వరమున స్వరసమ్మేళనమొనర్చి, జడకోలాటము వేయుచు "ప్రాణనాథ బిరాన బోవవే" అని పాడుచు మధురభావమునందోలలాడి మహాభావమునందు నిమగ్నులైరి.

భక్తుల యున్మాదమునకు మేరలేదు. వారిచర్యలు భావనాతీతములు. వారి రాజ్యము మనరాజ్యము గాదు. ప్రేమరసమును చవిఁజూచిన వారలే వారి

నయములు చేయసాగెను. అప్పుడీయన ముఖవినిస్సృత యభంగములు శ్రోతలఁ దన్మయత్వము నొందింపు చుండెను. ప్రఖ్యాతికెక్కిన భక్తులందఱు బాలకుల వలె నృత్యగీతాభినయములతోడ, ప్రేమరసమును గ్రోలి, తమ తమ స్థానములకేఁగిరి. ఎల్లరు తుకారాముని జీవన్ముక్తుఁడని తలంపసాగిరి.

రామదాసస్వామి "రామాయతీ" పంథావలంబకుఁడగు సన్న్యాసి. ఈయన బ్రాహ్మణవంశసంభూతుఁడును, మహా విద్వాంసుఁడును, శివాజీ మహారాజునకు దీక్షాగురువునై యుండెను. ఈయన ప్రథమావస్థయందొకింత స్వపంథానురాగము గలిగి శ్రీరామచంద్ర విగ్రహమునకుఁ గాక, మఱియే విగ్రహమునకును నమస్కరింపఁడయ్యె. కాని యీయన పండరిపురమున భక్తసమావేశమునందు కలసినప్పటినుండియు చిత్తపరివర్తనుఁడై పండరిపురనాథుని దర్శించి యిట్లనియె.

"మనోమోహనశ్యామసుందమూర్తియగు శ్రీరామా? చాపమును బాణములను బరిత్యజించి, యీ యిటుక పీఠముపైని శయనించినావా?" అని నుడివి నమస్కరించి పండరిపురమునుండి వెడలునప్పుడు "సమ

పాటకు లోకటిగాఁగూడి సంకీర్తనను సలిపిరి. కాని భావోన్మత్తుఁడగు తుకారాముని యసదృశ సంకీర్తనము శ్రోతల మంత్రముగ్ధులుగ నొనర్చుటవలన, నొకమాసముపఱకాయన సంకీర్తనము ప్రతిదినముఁను జరుగుచుండెను. ఉత్సవాంతమున ఛత్రపతి శివాజిమహారాజు, బ్రాహ్మణులను, భక్తులను, సన్న్యాసులను, జ్ఞానులను, ధనకనక వస్తువాహనములతోఁడ బూజించి, తుకారాముని బూజించుటకు స్వర్ణముద్రలను సిద్ధపఱచి నాలుగుగ్రామము లర్పింపనెంచియుండెను. కాని తుకారాముఁ డీ సడిని గ్రహించి యెరికిఁ దెలియకుండ పలాయనుఁడయ్యె. ఇందువలన శివాజీ మితిలేని పరితాపమును బొంది, తన పరితాపమును రామదాస స్వామికి నివేదించుకొనఁ యాయన యిట్లనియె. "చతుర్విధ ముక్తులనే, సామాన్యముగ జూచు తుకారాముఁడీ యైహిక సంపదల గణనఁ జేయునా?"

ఆషాఢ కార్తీక మాసములలో పండరిపురమున జరుగు యేకాదశీ యుత్సవములకు తుకారాముఁడు తప్పక నేఁగుచుండెడి వాఁడు. ఒకమారు శరీరాస్వస్థత వలన మంచమునుండి దిగఁజాలక, విఠోబా దర్శనమున కేఁగఁజాలనైతినని పరితపించుచుండెను. ఇట్లుండ నొక

ఓపాండురంగా! నామనోభావముల నీవే తెలిసికొనఁ గలుగుదువు."

"నిన్ను చూడవలయునను కోరిక నాహృదయ మును ధల్లడిల్లఁ జేయుచున్నది. కాని యది నెరవేర నందున నేనస్థిరుడనై యున్నాను. నా మనము మంగలా మునఁ బెట్టి వేచుచున్నట్లున్నది. నే నేపాపమును జేయుట వలన నాకన్నులు నీమూర్తిని జూడఁజాలకున్నవి? నా కపాల లిఖితమునుగూర్చి యేమనియెదవు? ఎందువలన నాపాదములు పండరి పురమార్గమున నడచుట లేదు? నామస్తకము నీచరణము లానకుండుటకు కారణమేమి? ఎందువలన నాహస్తములు నీకు నమస్కరించి ధన్యత నొందుటలేదు? నాజిహ్వ నీకీర్తిని గానము చేసి పవి త్రత నొందుట లేదేమి? ఓప్రభో! ఎప్పుడు నీమహా ద్వారమునఁ బడి సాష్టాంగదండ ప్రణామం బాచరిం తును?"

"అనేక దినములనుండి నీ వాక్యములనే నమ్మి యున్నాను. కాని, నాపై నుదాసీనభావమును, జూపు చున్నావేల? ఇంత కాఠిన్యమును జూపుట న్యాయమా? నన్ను మఱచితివా? ఓ గోవిందా! నీవెట్టి గురుతర కార్యమునందు మునిఁగియున్నావు? నీ సంతానము వృద్ధి యగుటవలన నన్ను త్యజించితివా?

సాధారణ ప్రజలు తుకారాముని అలౌకిక భక్తి సంపన్నుఁడని యెంచి యాయన శిష్యవర్గమునఁ జేరుచుండిరి. కడు దూరదేశములనుండి గూడ, రోగములు పోవునను దలంపున రోగార్తులును, పుత్రులు కావలెయునను దలంపున పుత్రహీనులును వచ్చి, తుకారాముని శరణుజొచ్చుచుండిరి. వైరాగ్య పరిపూర్ణుఁడగు తుకారాముని అభంగములు పశువుల కాపరులు మొదలు రాజాధిరాజుల వఱకును బాడుచు ఆత్మోన్నతి నొందుచుండిరి. రేయింబవలను భేదములేక ప్రజలు గుంపులుగ వచ్చి తన్నుఁజుట్టికొని తమకష్టములను విన్నవించుకొనుచుండుటవలన విరాగమునఁ గాలము గడుపనెంచియున్న తుకారామునకు మనస్సంకటము మిక్కుటమై "ఓప్రభో! ఆలస్యము చేయుటేల? నన్ను వైకుంఠమునకుఁ దీసికొనిపొమ్ము" అని కేకలు వైచుచుండెడివాఁడు. అనవరతవ్రతములు, ఉపవాసములు, జాగరణ మొదలగు వానివలన నీయన శరీరము క్రమక్రమముగ క్షీణింపఁజొచ్చెను. భక్తబృందము సమావేశమైనంతటనే యున్మత్తుఁడై సంకీర్తనను ప్రారంభించి నూతన అభంగములను జెప్పుటవలన మానసిక శ్రమమిక్కుటమయ్యెను. శక్తితఱిగిన కొలఁదిని తన ప్రవాసకాలము

వద్విధానము వలననే సంభవించినదని తలంపుఁడు. పోయినధనమంతయు భగవంతుని సేవకొఱకు వినియోగింపఁబడినదని తలఁచి దుఃఖమునుమానుఁడు. సుఖదుఃఖముల కంతరాత్మస్థితుఁడగు భగవానుఁడేభోక్త. శరీరమగ్నియందుఁబడి కాలునప్పుడాదుఃఖము నాతఁడే పొందుచున్నాఁడు. కావున దుఃఖము లెప్పుడు జీవునకుఁ జెందవు.".

ఈఘటనను బ్రత్యక్షముగఁ జూచుటవలన తుకారాముని స్వభావసిద్ధమగు కోమలహృదయము కరగిపోయెను. శత్రుహస్తచ్యుతమగు గ్రామముయొక్కదృశ్య మతి శోచనీయముగదా ? భస్మావశేషమైన భవనములను, పాడైన సస్యక్షేత్రములను చూచునప్పుడును, తలిదండ్రుల నెడఁబాసిన బాలురయొక్కయు, భర్తలఁ గోల్పోయిన భార్యలయొక్కయు, భార్యలఁ గోల్పోయిన భర్తలయొక్కయు, ఆర్తనాదములు వినునప్పుడును, ఎట్టి పాషాణ హృదయములైనను బ్రద్దలగుననుట వింతగాదు. తుకారాముఁ డీహృదయ భేదకమగు దృశ్యమునుజూచి 'ఓప్రభో ! మర్త్యలోకమునందు నివసింపవలయునను ఆశ పూర్తియైనది. నన్నిఁక వైకుంఠమునకుఁ దీసికొనిపొమ్ము.' అని విఠోబా

ఇంతకుఁ బూర్వము కొలఁది దినములనుండి తుకారాముఁ డేతీర్థమున కేఁగుచున్నను, "నేను వైకుంఠమున కేఁగుచున్నానని" చెప్పుచుండుటవలన ఇపు డీయన యేదియో నూతన తీర్థయాత్ర కేఁగుచున్నాడని తలంచి జిజీబాయి యేవిధమగు పరితాపము నొందక "గర్భిణిగ నున్న నేనేవిధముగ పిల్లలను వదలి మీతో వత్తును ?" అని ప్రత్యుత్తరమంపెను. ఈవార్తనందికొని పరివేష్టితులగు వారలఁజూచి తుకారాముఁ డిట్లనియె. "అన్నలారా! నేను వైకుంఠమున కేఁగుచున్నాను. ఇఁక తిరిగి మిమ్ముఁగలసి సంకీర్తనఁ జేయఁ బోను. హరినామస్మరణయే సమస్తమానవులకు శరణ్యము. పాండురంగనాథుని శరణుజొచ్చి మనుఁడు. శిష్యులారా! నేనేఁగుచున్నాను. బందుగులారా! నాకు సెలవు. స్నేహితులారా! సెలవు. నేనిప్పు డమరధామమున కేఁగుచున్నాను. నాభార్య యిచ్చటనేయున్నది. ఆమెకు గృహకార్య నిర్వాహక చతురత లేదు. మృదుమధురముగ మాట్లాడఁ జాలదు. నే ననేకవిధముల నామెకు ఋణపడియున్నాను. ఇహలోకమునం దామెను మీరు గనిపెట్టియుండుఁడు." అని చెప్పుచు, సాష్టాంగ దండప్రణామంబొనర్చి, పుట్టినింటి కేఁగు జవ్వనింబోలె, చిఱునవ్వులొలయ, విఠోబా

నున్న భార్యనుజూచి "నీగర్భమునందున్న పుత్రుఁడు మహాభక్తుఁడగును. కావున వానికి నారాయణుఁ డని పేరుఁ బెట్టుము" అని నుడివినటులనే తుకారాముని భవిష్యద్వాణి సఫలమయ్యెను. నారాయణుఁడు మహాభక్తి సంపన్నుఁడై యనేక యభంగముల రచియించెను. ఆబాలగోపాల మాయభంగము లిప్పటికిని, మహారాష్ట్ర దేశమునందు బాడుచుందురు. తుకారాము పరలోక యాత్ర కేఁగిన యొక వత్సరమునకు శివాజీమహారాజు దేహూగ్రామమునకువచ్చి, తుకారాముని కుటుంబ పోషణార్థ మొక గ్రామమును జాగీరుగనిచ్చెను. ఇప్పటికిని యాజాగీరును వారివంశస్థు లనుభవింపు చున్నారు.

తుకారాముని పరలోకగమనమునుగూర్చి మహీపతి యీవిధముగ వ్రాయుచున్నాఁడు. "ఇంద్రాణీనదీ తటమునం దంతిమప్రార్థనారూపమగు అభంగము తుకారాముని ముఖవినిసృత మైనంతటనే దివ్యజ్యోతివలన పార్శ్వవర్తులకన్నులు మూతపడెను. కన్నులు దెఱచి చూచు నప్పటికి తుకారాము గన్పింప లేదు. స్వర్గము నుండి దేవగణమువచ్చి తుకారాముని విమానముపై నెక్కించుకొని వైకుంఠమునకుఁ దీసికొనిపోవు చుండుటను భక్తులు మాత్రమే చూడఁగలిగిరి."

కేఁగెను." అని వ్రాయఁబడియున్నది. కావున నేవిధమగు యలౌకిక ఘటనలు లేని యీ వాక్యములే విశ్వసింపఁదగియున్నవి.

## ఉపసంహారము

తుకారాముని జీవిత మనేక ఘటనలతోఁగూడి, కౌతూహలజనకమును, శిక్షాప్రదమునై యున్నది. సుఖదుఃఖములవలన మనుష్యున కెట్టిశిక్ష సమకూరునో, అట్టిశిక్ష తుకారాముని జీవితమునందు సంపూర్ణాకారమును దాల్చెను. ఈయన సంపన్న గృహస్థునింట జన్మించి తలిదండ్రుల పరమాదరమునకుఁ బాత్రుఁడై, సామాజికరీతి ననుసరించి, తరుణవయస్సుననే సంసారమునందు దిగి, కులపరంపరాగతమగు వ్యాపారమునం దడుగిడిన కొద్దిదినములకే, ధనార్జనానిపుణుఁడై సరివారిలోఁ బ్రశంసింపఁబడుచు తలిదండ్రుల వాత్సల్యమును భార్య యొక్క ప్రేమయు నవజాతపుత్రునియందుండు మోహమును ధనకాంక్షయు మొదలగు వానియందుఁ దగుల్కొనెను. కాని రాజకుమారుఁడగు సర్వార్థసిద్ధుని నే మహాశక్తి బిచ్చగానిగ నొనర్చెనో, ఆమహాశక్తివలన తుకారాముఁడాకర్షింపఁబడెను. పృథివియందలిదుఃఖము హింస మొదలగువానితోఁ బోరాడి, ప్రేమరాజ్యమును

యొక్క మనోమాలిన్యమును దూరము చేయుటకు ప్రచండానల రాశితోఁ బోల్పఁదగిన కష్టములయందుఁ బడవేయుచుండును. అట్టి పరీక్షలకుఁ దాళినవారలే మహాభక్తులగుచుందురు. తుకారాముని చరిత్రను దీర్ఘాగ్ని పరీక్షయని చెప్పనొప్పు. సంసారముయొక్క అసారత్వమును గ్రహించినకొలఁదిని యీయనను వైరాగ్యమావరించుచుండెను. వైరాగ్యమావరించినకొలఁదిని, లోకులీయనను పిచ్చివాఁడనియు, మూఢుఁడనియు, నిందింపసాగిరి. కాని వీనివలన తుకారాముఁడు చలింపకుండెను. ముండ్లమండ్లతో దెబ్బలుతినుటయు, అభంగములను గోల్పోవుటయు, మొదలగు కష్టము లొకటి వెంటనొకటి సంభవింపుచుండెను. ఈ కష్టములకుఁ దోడుగ గృహమునందణుమాత్రమైనను శాంతి లేకున్నను, ఈయన చూపించుచు వచ్చిన * సహిష్ణుత

* ఒకానొకప్పుడు పిల్లలకు దీసికొనివచ్చిన చెఱకుగడలను తుకారాముఁడు బీదబాలురకు పంచిపెట్టుచుండుటను జూచి, జీజీబాయి చెఱకుగడ రెండుతుండెము లగునటుల నీయన వీపుమీఁద గొట్టినదనియు వీతక్రోధుఁడగు తుకారాముఁడు భార్యవంకఁ దిరిగి "మనయిరువురకొఱకు నిత్తుదండమును రెండుచేసినావా" యని చెప్పెనని మహీపతి వ్రాయుచున్నాఁడు. ఈకథ సత్యమే యయినచో తుకారాముని సహిష్ణుత వర్ణనాతీతముగదా !

ధురముగను గవిత్వము జెప్పఁగలిగి యుండెను. భావ మయమగు నీ కవిత్వము సాత్వికభక్తి రసాస్వాదకమై యున్నది. మహారాష్ట్రి జాతీయతయందు నిద్రాణంబై యున్న భక్తితత్త్వమును, ఈతఁడు మృదుమధుర కవిత్వముతోడ నుద్బోధింపఁజేసెను. "ప్రేమతోఁగూడినభక్తియే యీశ్వరునిఁ బొందుటకు ముఖ్యసాధనము" అని తుకారాముఁడు చెప్పియున్నాఁడు. విశుద్ధచిత్తమున భగవంతుని పాదములపై నిర్భరపడి మనస్సును విషయవాసనలనుండి నివృత్తినొందించి, హరినామస్మరణను జేయుచుండుటయే ముక్తికి శ్రేష్ఠతరమగు మార్గము. బహుళాడంబరములతోఁగూడిన కర్మలవలన. భక్తినశింపుచుండుటకు వగచి, సనాతనభక్తిధర్మమును బునరుద్ధరించుటకు తుకారాముఁడు ప్రయత్నించెను. ఈయన అభంగము లన్నియు, ఇహలోక సుఖముల క్షణికత్వమును, దుర్మార్గుల ప్రకృతిని, వారిదుర్బలత్వము మొదలగువానిని నిరసింపుచు, సాత్వికభక్తి ప్రబోధకములై యున్నవి. తుకారాముఁడు గృహస్థాశ్రమమందుండినను, ఘోరాటవులయందు దాకలములు దిని జీవించు వీతరాగులకంటె వీతరాగుఁడై యుండెను. అహంకారము, ఈర్ష్య, దురభిమానముల నెఱుంగక, నితరులకుఁ జెప్పు

ఈయన నూతనధర్మమును స్థాపింపలేదు కాని సనాతనధర్మమునకు నూతనవికాసమును గలిగించి యున్నాఁడు. ఈయన యభంగములం దీవిషయములు గన్పడుచుండును.

౧. సకలావస్థలయందును, భగవంతునియందు భక్తిఁగలిగియుండవలయును.

౨. తలిదండ్రులమీఁద యాధారపడుచు భగవానునిపై నిర్భరపడియుండవలయును.

3. భక్తిమార్గముననే యీశ్వరుఁడు లభ్యమగును. కాని బాహ్యానుష్ఠానములద్వారమున లభ్యము గాఁడు.

౪. సచ్చరిత్రుఁడై, సర్వభూతదయఁగలిగి, భగవంతుని హృదయపీఠమునం దధిష్ఠింపఁజేసికొనవలయును.

౫. సమస్తమానవులు భగవత్కృపకుఁ బాత్రులు. జాతినిబట్టిగాని, వంశమునుబట్టిగాని, భగవత్కృప కలుగనేరదు.

౬. ఈశ్వరునకును జీవులకును గల సంబంధ మతిమధురము. ఆయన మనకు దూరముండి నివసించుటలేదు. వ్యాకులహృదయమున నాయనను బిలచిన యెడల సమస్తస్థలములయం దాయనను జూడఁగలము.

యన విరచితమగు పదునాలుగువేల యభంగములు ముద్రితములై యున్నవి. మహాభక్తుఁడగు బమ్మెరపోతనామాత్యునకువలె నీయనకును భగవత్ప్రసాదమువలన కవిత్వధారయలవడెను. ఈయన కవిత్వమునం దెట్టిప్రమాదములులేక, సుబోధకమగు లలితశైలితోడ భక్తిరసపూరితమై, సునీతి పరిపోషకమై, అలరారుచున్నది. ఈయన పదునాలుగువేల యభంగములేకాక, ఈక్రిందఁ జేర్పఁబడిన గ్రంథములనుగూడ రచించియున్నాఁడు.

౧. భగవద్గీత పదునాఱవ అధ్యాయమునకు అనువాదము.

౨. నరసింహావతారచరిత్ర.

౩. ప్రహ్లాదచరిత్ర.

౪. వామనచరిత్ర.

౫. పరశురామచరిత్ర.

౬. శ్రీరామజన్మకథ.

౭. శ్రీరామచరిత్ర.

౮. శీతశ్లోకము.

౯. శ్రీకృష్ణునిజన్మకథ.

౧౦. శ్రీకృష్ణునిచరిత్ర (బాల్యలీల)

౧౧. కల్క్యవతారము.